శ్రీనివాసబాలభారతి_30

# దేవయాని

రచన:

డాక్టర్ మద్దూరు సుబ్బారెడ్డి

ప్రధానసంపాదకుడు:

డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య




ప్రచురణ:

శ్రీ జి. కుమారస్వామిరెడ్డి, ఐ. ఏ. ఎస్.,

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

1983

T. T. D. Religious Publications Series No-161

SRĪNIVĀSA BĀLABHĀRATI - 30
( Children Series )

DEVAYĀNI
by Dr. Madduru Subba Reddy

*Chief - Editor :*
Dr. S. B. Raghunadhacharya

First edition 1983

Copies : 10, 000

Price : 1–00

***Published by :***
Sri G. Kumaraswami Reddi, I.A.S.,
EXECUTIVE OFFICER,
Tirumala Tirupati Devasthanams,
Tirupati

Art : PĀṆI

**Printed at :**
Tirumala Tirupati Devasthanams Press, Tirupati.

# ముందుమాట

ఒకతోట అందంగా కనులకు విందుచేయాలంటే, ముందు అందులోని పూలమొక్కల్ని చక్కగా పెంచాలి. సమాజం సుందరంగా రూపొందాలంటే భావిభారతపౌరులైన బాలలు సంస్కారంతో పెరగాలి. మనసంస్కృతి గొప్పదనం వారికి తెలియనంతకాలం వారెన్ని విద్యలు సాధించినా ప్రయోజనం శూన్యం. "మహా పురుషులు మహాపతివ్రతలు మనజాతికెందుకు గర్వకారణమైనారు? వారినుంచి మనం ఏ ఆదర్శాన్ని నేర్చుకోవాలి?" అనే విషయాన్ని వారి కథను చెబుతూ మన చిన్నారి బాబులకు, పాపలకు చెప్పగలిగితే వారికి మనమెంతో సంస్కృతిసంపదనిచ్చిన వారమౌతాం. అలా సంస్కారంతో పెరిగిన బాలలు, తమ జీవితంలో ఎంతో మంచిని పెంచుకొని ఈ సమాజానికి ప్రేమను పంచుతారు. ఉత్తమ పౌరులై వారి కుటుంబానికేకాక, ఈ దేశానికిగూడ పేరు ప్రతిష్ఠలను సంపాదిస్తారు.

తిరుమల తిరుపతి దేవస్థానం, ఇలాంటి ఉద్దేశ్యంతోనే ఈ "శ్రీనివాస బాలభారతి" అనే పుస్తకమాలను, చిన్నపిల్లలకోసం.

ప్రకటిస్తున్నది. దీన్ని బాలభారతి అని పిలిచినా పెద్దవాళ్లకు గూడ ఎంతో విజ్ఞానాన్నందిస్తూ ఇది ప్రతికుటుంబాన్నీ ఆకర్షిస్తున్నది. చక్కని ఆదర్శం కలిగి, చరిత్రప్రసిద్ధి పొందిన మహాపురుషుల, మహాపతివ్రతల కథలు ఇందులో చిన్న చిన్న వాక్యాల్లో చెప్పడం జరుగుతుంది. ఈ బాలసాహిత్యాన్ని చిన్నారిపాపలు బాగా చదివి ఉపయోగించుకుంటారని ఆశిస్తున్నాను.

ఈ బాలసాహిత్యప్రణాళికను చక్కగా రూపొందించి, మంచి రచనలను తయారుచేయించి, అందరికీ అందుబాటులో ఉండేటట్లు సంపాదించిన డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య (కో-ఆర్డినేటర్, పబ్లికేషన్స్, టి. టి. డి.) గారికి నా అభినందనలు. ఈ ప్రణాళికలో ఎందరో రచయితలు కళాకారులు సహకరిస్తున్నారు: వారందరికి నా ధన్యవాదాలు.

శ్రీశంకరజయంతి
17—5—83

జి. కుమారస్వామి రెడ్డి, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# స్వాగతం!!

శ్రీనివాసదయోద్భూతా బాలానాం స్ఫూర్తిదాయినీ ।
భారతీ జయతాల్లోకే భారతీయగుణోజ్జ్వలా ॥

ఖండ ఖండాంతరాల్లో నాగరికత కన్నువిప్పేనాటికే సభ్యతకు సంస్కారానికి, నైతిక – ధార్మికాదర్శాలకు పేరుపడ్డది మన భరతఖండం. ఈ గడ్డపై పుట్టిన ప్రతిమానవుడు అధర్మాన్ని ఎదిరిస్తూ, ధర్మాచరణంలో తన జీవితాన్ని పండించుకొని, మాధవాభిముఖంగా నడచి మహనీయకీర్తినార్జించినవాడే. అలాంటి మహాత్ముల సన్నిధి మన సుఖసంతోషాలకు పెన్నిధి. కనీసం వారి జీవితాదర్శాలు మనస్సుల్లో మెదిలితే వాటి ప్రభావం మనమీద ఎంతో ఉంటుంది. 'నేను భారతీయుణ్ణి' 'ఇది తరతరాలనుంచి వస్తున్న నా సంప్రదాయం' 'ఇది నా కర్తవ్యం' అని ప్రతిబాలుడు బాలిక ఈ దేశసేవకు తనను అంకితం చేసుకుంటారు.

నిజానికి ఈ దేశంలో ఎందరో మహానుభావులు మహాపురుషులు, మహాపతివ్రతలు, మహావీరులు పుట్టి, పెరిగి, చక్కని

సంస్కృతికి పునాదులు వేశారు. స్వచ్ఛమైన జీవనవాహినిని మన దాకా ప్రవహింపచేశారు. అహా! మనమెంత అదృష్టవంతులం! మన వెనుక ఎంత ఉదాత్తమైన చరిత్ర ఉంది. ఆ పుణ్యపురుషులు మహాసాధ్వులు ఇక్కడ పుట్టకపోతే మనదిగా మనం చెప్పుకొనే మహోత్తరమైన ఈ సంస్కృతి, సభ్యత మనకెలా సంక్రమించేవి! వాళ్లను అర్థంచేసుకోవడం, వాళ్ల చరిత్ర మననంచేసుకోవడం వారి ఆదర్శాలు స్మరించడంకూడ మనకు గొప్ప విజ్ఞానాన్నందించే విద్యాభ్యాసం. అది ముందు ముందు మనజాతి జీవనప్రవాహంలో కొన్ని ఏండ్లదాకా చెక్కుచెదరని స్ఫూర్తిసౌరభాలను విరజిమ్ముతుంది. అందుకే శ్రీనివాసబాలభారతి ఉదయించింది. ఎందరో మహానుభావుల్ని మీ ముందుంచుతోంది. ఇక మీదే ఆలస్యం.

బాలలూ! రండి! రండి!

విందు మనస్సుతో మీ కిదే మా స్వాగతం!

శ్రీశంకరజయంతి
17-5-1983

ఎస్. బి. రఘునాథాచార్య
ప్రధానసంపాదకుడు

ఆమె అల్లారుముద్దుగా పెరిగిన అందాలబాల. తన పంతం నెగ్గించుకోవడంలో తనకు తనేసాటి. విందుయవ్వనం పండు వెన్నెల్లో తనకు నచ్చినవాడిని మూగగా ఆరాధించింది. తాను మనవిచ్చినవాడు బూడిదైపోతే మళ్లాజీవితాన్ని ప్రసాదింపజేసింది. గురుపుత్రివని అతడు నిరాకరించాడు. తట్టుకోలేక నిప్పులు కురిపింది ఆ అబల అమాయికత.

ఒకప్పుడామెను నెచ్చెలి కార్చిచ్చులాగా అధికారగర్వాంధ కారంలో గనగన మండిపడి అవమానించింది. నీతిమాలి నూతిలో నెట్టిపారేసింది. ఎలాగో బతికి బయటపడిన ఆమె, తనవ్యక్తిత్వాన్ని చులకనచేసిన ఆ రాజ్యంలో అడుగుపెట్టనన్నది. చివరకు అవమానించిన రాచరికం ఆమెకు దాస్యంచేసింది. పట్టమహిషిగా పట్టలేని సంతోషాన్ననుభవించిందామెలోని భామిని.

ఆమెను హేయంగా అవమానించి అంతంచేయాలని అవల ప్రయత్నంచేసి దాసియైన రాచకన్య, అనుకోకుండా సవతియై కూర్చుంది. స్త్రీజీవితంలో ఇంతకంటే పిడుగుపాటు ఏముంటుంది?

భగ్గుమన్నది ఆ భగ్నహృదయం. ఆమె ఎవరో తెలుసా? శుక్రుని కూతురు దేవయాని.

తండ్రి ఉపదేశామృతవర్షం, భర్త చల్లనిమాటలవెన్నెల ఆమె మనసును చల్లబరచాయి. అమాయికత్వానికి, ఆదర్శ వ్యక్తిత్వానికి, అచ్చమైన ప్రీతత్వానికి ఆమె ప్రతీకగా నిలచింది. హృదయాన్ని కదిలించే ఆమె కథను చదువుకుందామా?

ప్రధానసంపాదకుడు.

# దే వ యా ని

**చేసినతప్పు తెలుసుకోవాలి !**

లోకంలో కొందరు అతిగారాబంగా పెరుగుతారు. తండ్రి గొప్పవాడయితే ఆ గారాబం గర్వంగా మారుతుంది గర్వంవల్ల తమకు తాము అపకారం చేసుకుంటారు. ఇతరు లకూ బాధకలిగిస్తారు. తెలివిగలిగినవారయితే చివరకు చేసిన తప్పులు తెలుసుకొని సవరించుకుంటారు. మెప్పు పొందుతారు. చేసిన తప్పు తెలుసుకోవడమే గొప్పతనం. దాన్ని సవరించు కోవడమే విజ్ఞత. అప్పుడే మానవులు మహాత్ములవుతారు.

**ఆడిందే ఆట; పాడిందే పాట :**

రాక్షసుల గురువు శుక్రుడు. అతని భార్య ఇంద్రుని కుమార్తె అయిన జయంతి. వారిరువురి ముద్దుబిడ్డ దేవయాని. శుక్రుడికి దేవయాని మీద అమితప్రేమ. చాల గారాబంగా పెంచాడు. ఆమె ఆడిందే ఆట; పాడిందే పాట. ఆమెను ఎవరూ ఏమీ అనడానికి వీల్లేదు. ఆమె అలిగితే శుక్రుడు విల విలలాడిపోయేవాడు. ఆమె అడిగితే అందలం ఎక్కించేవాడు.

ఎలాగైనా మృతసంజీవనీవిద్య సంపాదించు :

శుక్రుడు శివుని గురించి తపస్సుచేసి 'మృతసంజీవనీ విద్య'ను సంపాదించాడు. దేవతలకు దానవులకు ఎప్పుడూ యుద్ధాలు జరుగుతుండేవి. ఆ యుద్ధాల్లో శక్తిమంతులైన దేవతలు దానవుల్ని చంపుతుండేవారు. కాని శుక్రుడు మృత సంజీవనీ విద్యతో వారందర్ని మరలా బ్రతికించేవాడు. అందువల్ల యుద్ధంలో దేవతలు దానవుల్ని గెలవలేక పోతున్నారు. ఇది వారికొక పెద్దసమస్య అయింది. దేవత లందరూ ఒకచోట చేరి చర్చలు జరిపారు. చివరికొక నిరయానికొచ్చారు.

"మృతసంజీవనీవిద్యతోనే గదా! రాక్షసులు బ్రతుకు తున్నారు! అందుచేత ఆ విద్య మనలో ఎవరైనా నేర్చుకోవాలి. దానికి తగినవాడు బృహస్పతి కుమా రుడు కచుడే. వినయం, భక్తి, దీక్ష ఉన్నవాడు. పని సాధించుకొని రాగలడు."

అని అనుకొని కచుణ్ణి పిలిచారు. ఎలాగయినా శుక్రునికి సేవలు చేసి మృతసంజీవనీ విద్య సంపాదించమని వేడుకున్నారు.

విద్యకోసం ఎన్ని ఇబ్బందులైనా ....

కచుడు దాని కంగీకరించాడు. అతి కష్టమైన పనే! అయినా పెద్దల కోర్కెగనుక శిరసావహించాలని నిశ్చయించుకొన్నాడు. దేవతల్లో ఎవరూ సాధించలేని విద్యను తను సాధించబోతున్నందుకు సంతోషించాడు. విద్యకొరకు ఎంత దూరం వెళ్లినా, ఎన్ని ఇబ్బందులు పడినా పరవాలేదనుకున్నాడు. విద్యార్జనకొరకు శత్రు కూటంలోకి వెళ్లడానికి కూడ కచుడు జంకలేదు. శుక్రుడు వృషపర్వుడనే రాక్షస రాజు పురంలో వున్నట్లు తెలుసుకున్నాడు. ప్రయాణమయ్యాడు.

ఇదే నా జీవిత పరమార్థం:

శుక్రుని దగ్గరకు వచ్చి—

"మహాత్మా! నేను బృహస్పతి కుమారుణ్ణి. నా పేరు కచుడు. ఏవో కొన్ని విద్యలు నేర్చుకొన్నాను. అవి నాకు తృప్తి కలిగించలేదు. నేర్చుకొనవలసింది ఎంతో వున్నదని గ్రహించాను. విజ్ఞానసంపన్నులైన మీ సన్నిధిలో విద్యలు నేర్వాలని అనుకున్నాను. ఇదే నా జీవితపరమార్థం"

అన్నాడు. శుక్రుడు చలించిపోయాడు. కచుని వినయ సంపత్తి అతణ్ణి కదిలించింది. విద్యాదానంకొరకు చేయి చాచిన వాడికి లేదనడం మహాపాపమని భావించాడు. కచుడితో యిలా అన్నాడు:

"కుమారా! నేనూ మీ తండ్రి బృహస్పతి ఒకచోట చదువుకున్నాం. మీ తాత అంగీరసుడు మా గురువు. నీవు నాకు శిష్యుడవయ్యావు. ఈ విధంగా మా గురు ఋణం తీరుతుంది. సహపాఠకుడి కుమారుడివి. అదొక విశేషం".

అని కచుణ్ణి శిష్యుడిగా గ్రహించాడు.

**ఆహా! ఎంతమంచి శిష్యుడు**

శుక్రుడు కచుడికి విద్యారహస్యాలన్నీ వివరించడం ప్రారంభించాడు. కచుడు గురువుగారి మనస్సు మెచ్చేటట్లు ప్రవర్తిస్తున్నాడు. ఏపని అయినా చెప్పకముందే గ్రహించి చేసేవాడు. ఆశ్రమం ఊడ్చేవాడు. అడివికి వెళ్ళి కట్టెలు దర్భలు తెచ్చేవాడు. పూజకు పూలు ఏరి తెచ్చేవాడు. ఫలాలు కోసి తెచ్చేవాడు. గ్రంథాలు చక్కగా పెట్టేవాడు.

వ్యాసపీఠాన్ని సరిచేసేవాడు. పిలిచిందే తడవుగా ప్రతిపనికీ తయారవుతూ వుండేవాడు. గురుసేవలతో కచుడు శుక్రుడికి ప్రియశిష్యుడైనాడు. కేవలం పనులు చేయడంలోనేకాదు విద్యలు నేర్వడంలో కూడా చాల చురుకుగా వుండేవాడు. చెప్పేది శ్రద్ధగా వినేవాడు. ఒకటికి రెండుసార్లు మననం చేసుకొనేవాడు. అనుమానం వస్తే ప్రశ్నించేవాడు. దాన్ని తీర్చుకొనేవాడు. ఆహారాన్ని కూడా మరచి అభ్యాసం చేస్తూ వుండేవాడు. కొత్త విషయాలను తెలుసుకోవాలని తహతహ లాడేవాడు.

నేనంటే ఎంత ప్రేమ:

కచుడు కేవలం శుక్రుడి మనస్సు కెక్కడమే కాదు దేవయాని మనస్సునూ మెప్పించాడు. దేవయానితో కలిసి మెలసి ఇంటి పనులన్నీ చేసేవాడు. గోవుల్ని మేపుకొచ్చేవాడు. ఆమె పూజకు పూలు తెచ్చి సమర్పించేవాడు. మాలలు కట్టి ఆమెకు కానుకగా ఇచ్చేవాడు. చెట్లకు పాదులు తీసేవాడు. నీరు తోడేవాడు. చెట్లకు పోసేవాడు. ఈ పనులన్నీ మొదట్లో దేవయాని చేసేది. ఆమెకు బాధ కలుగు

తుందని తానే ఈ పనులన్నీ చేయసాగాడు. ఈ వినయ సంపన్నత, ప్రవర్తన దేవయానిని ఆకర్షించింది. లోలోపలే మెచ్చుకొనేది. కచుడికి ఏబాధ కలిగినా నొచ్చుకొనేది. పూలలో దారంలాగా కచుడు ఆ యింట్లోవారితో కలిసి పోయాడు.

రహస్యమంత్రం ఇతడికి నేర్పితే!

ఈ విధంగా కచుడు శుక్రుడికీ, దేవయానికీ యిష్టుడు కావడం రాక్షసులకు కష్టంకలిగించింది. కచుడూ, దేవయాని దగ్గరకావడం రాక్షసులు ప్రమాదమని భావించారు. వాళ్లిద్దరూ ప్రేమించుకుంటే! వివాహంచేసుకుంటే! రహస్యమైన మంత్రవిద్య శుక్రుడు కచుడికి నేర్పుతాడేమోనని భయపడ్డారు. దానికొక ఉపాయం ఆలోచించారు. ఒకనాడు కచుడు అడవికి గోవులను మేపడానికి వెళ్లాడు. ఆవుల్ని మేపి అలిసిపోయి చెట్టుక్రింద పడుకున్నాడు. రాక్షసులు అతణ్ణి పట్టుకుని చంపారు. అతని కళేబరాన్ని చెట్టుకు వ్రేలాడగట్టి వెళ్లిపోయారు.

ఏం ప్రమాదం కలిగిందో! పాపం:

ప్రొద్దుకూకింది. కచుడు తిరిగిరాలేదు. దేవయాని మనస్సు వికలమయింది. తపన పడింది. తత్తరపడింది. తండ్రితో "నాన్నా! సూర్యుని వేడివెలుగులు చల్లారి పోతున్నాయి. చీకట్లు వ్యాపిస్తున్నాయి. సమయానికొచ్చి మీఅగ్నిహోత్రానికి సమిధలు కూర్చే మీశిష్యుడింకా రాలేదు. ఏదోభయంగావుంది. మృగాలేమైనా ప్రమాదం కల్గించాయా? పాములు కాటువేశాయా? లేక రాక్షసులేమైనా చేసివుంటారా"? అన్నది. శుక్రుడు దివ్యదృష్టితో చూశాడు. అసురులు కచుని ఉసురుతీశారని గ్రహించాడు. మృతసంజీవని విద్యను ఆదేశించాడు. వెంటనే ఆవిద్య అడవిలో మృతుడైన కచుణ్ణి బ్రతికించి తీసుకొని వచ్చింది. దేవయాని మనస్సు కుదుట పడింది. కచుడు కృతజ్ఞతతో సంతోషించాడు. శుక్రుడికి, దేవయానికి నమస్సు లర్పించాడు.

అతణ్ణి మరచిపో!

ఒకనాడు కచుడు మరల అడవికి వెళ్ళడానికి ప్రయాణ మయ్యాడు. దేవయాని వద్దని చెప్పింది. కచుడు:

"మీ అభిమానం, గురువుగారి వాత్సల్యం నాకు కవచాలు. నాకేమీ భయం లేదు."

అని అడవికి వెళ్లాడు. రాక్షసులు కచుణ్ణి వధించారు. కట్టెలు పేర్చారు. కాల్చారు. బూడిదను కల్లుముంతలో కలిపారు. ఆ కల్లును తీసుకొని వచ్చి శుక్రాచార్యులవారికిచ్చారు. దౌర్బల్యంతో శుక్రుడు దాన్ని సేవించాడు. రాక్షసులు తృప్తిగా తమలో తాము నవ్వుకొని వెళ్లిపోయారు.

సూర్యుడస్తమించినా కచుడు తిరిగిరాలేదు. దేవయాని కలత పడింది. జరిగినదాన్ని ఊహించింది. అసురులే చంపి వుంటారని తండ్రితో అన్నది. శుక్రుడు కూడ గ్రహించాడు.

"అమ్మా! కచుని కొరకు ఎందుకు దిగులుపడడం? ఎలాగూ రాక్షసులు అతణ్ణి బ్రతకనివ్వరు. అతడు పుణ్యలోకానికి వెడతాడు. నీవు అతణ్ణి మరచిపో."

అన్నాడు. దేవయాని కడుపు చెరువయ్యేటట్లు ఏడ్చింది. ఆహారం ముట్టలేదు. కుమార్తె అంటే ప్రాణమైన శుక్రుడు దివ్యదృష్టితో చూశాడు. లోకాలన్నీ వెతికాడు. ఎక్కడా కచుని జాడ కనిపించలేదు. మరలా చూశాడు. కచుడు బూడిద

రూపంలో తన కడుపులోనే కనిపించాడు. తన దౌర్బల్యం కారణంగా జరిగిన అపకారానికి బాధపడ్డాడు.

**సురాపానమే అన్నిపాతకాలకు మూలం:**

ఇలా అనుకున్నాడు. మద్యపానం ఎంతో చెడు చేస్తుంది. జన్మజన్మల పుణ్యంవల్ల మనం జ్ఞానం సంపాదిస్తాం. ఆ జ్ఞానమంతా ఈ తాగుడువల్ల నశిస్తుంది. నరనరాల్లోని శక్తి వుడిగిపోతుంది. దాంతో బుద్ధి మందగిస్తుంది. మంచిలేదు. చెడులేదు. అది నడిపినట్లు నడవాలి. బంధువులు, స్నేహితులు ఈసడించుకుంటారు. శ్రమించి సంపాదించిన విద్యలు నశిస్తాయి. అభిమానం నశిస్తుంది. తాగినవాడు తూలి దుమ్ములో ధూళిలో పొర్లాడతాడు. అందరూ నవ్వుతారు. ఛీదరించుకుంటారు. సంఘంలో విలువవుండదు. ధనం కరిగి పోతుంది. శరీరం కృశించిపోతుంది. రోగాలు చుట్టుముట్టు తాయి. రోగాలకు తట్టుకొనే చేవలేక సతమతమై మరణించాలి. తాత్కాలికమైన ఉద్రేకంకోసం శాశ్వతమైన ఆనందాన్ని కోల్పోతున్నాం. ఈ మద్యం సేవించడంవల్లనేగదా ఈ ప్రమాదం– అని ఆలోచించి శుక్రుడు సురాపానం మహా పాతకమని శపించాడు.

**తానొకటి తలిస్తే దైవమొకటి తలుస్తుంది:**

తనగర్భంలోని కచుణ్ణి సంజీవనీ విద్యతో మరలా బ్రతికించాడు. గర్భంనుండే కచుడిలా అన్నాడు:

"గురువర్యా! మీ దయవల్ల బ్రతికాను. కాని బయటికి రావడం ఎలాగ? ఆ మార్గం సెలవియ్యండి."

శుక్రుడు ఆలోచించాడు.

"మృతసంజీవనీ విద్య నీకు నేర్పుతాను. నా కడుపు చీల్చుకుని బయటికిరా. మరణించిన నన్ను నీవు బ్రతికించు. ఇంతకంటె మరొకమార్గం లేదు."

అన్నాడు శుక్రుడు. జన్మజన్మల కోర్కె తీరింది కచుడికి. దేని నిమిత్తం ఇన్ని కష్టాలుపడి వచ్చాడో ఆ పని నెరవేరుతుంది. అపకారం చెయ్యబోయి రాక్షసులు తనకు ఉపకారమే చేశారు. మనం ఒకటి తలిస్తే దైవం వేరొకటి తలుస్తాడనేది నిజం. కచుడంగీకరించాడు. విద్య తెలుసుకున్నాడు. శుక్రుని కడుపు చీల్చుకొని బయటపడ్డాడు. అన్నమాట ప్రకారం శుక్రుణ్ణి బ్రతికించాడు. కచుడు గురుద్రోహి అయితే పరిణామం ఎలా వుండేదో!

నా మనస్సులో ఎప్పుడూ అదే స్థానం:

వచ్చినపని కావడంతో కచుడు దేవలోకానికి ప్రయాణమయ్యాడు. దేవయాని దగ్గరకు వెళ్లాడు. సెలవు కోరాడు. దేవయాని దుఃఖం కట్టలు త్రెంచుకున్నది. మొదటినుంచి కచుణ్ణి తన మనస్సులోనే ఆరాధిస్తూవుంది. ప్రియుడిగా భావించింది. కాని పెదవివిప్పి ఎప్పుడూ చెప్పలేదు. గాఢంగా మనసులో వుంచుకున్నది. ఈ రోజు మనసు పురివిప్పింది. గుండెలో గుబులయ్యింది. ఉండిపొమ్మని కచుణ్ణి వేడుకుంది. తండ్రితో చెప్పి పెళ్లిచేసుకుందామని ప్రార్థించింది. కచుడిలా అన్నాడు-

"గురుపుత్రీ! ఇది నీకు తగదు. గురువు తండ్రివంటివాడు. గురుకుమారి సోదరి అవుతుంది. నామనసులో నీకు ఎప్పుడూ అదే స్థానం. ఇప్పుడూ అదే స్థానం."

ఏతు విద్య పనిచేయదు:

దేవయానికి కోపంవచ్చింది. కచునితో ఇలా అన్నది!

"నా తండ్రి నేను కాదంటే నిన్ను శిష్యుడిగా అంగీకరించేవాడు కాదు. నీకు విద్యలు నేర్పేవాడు కాదు. నీమీద ప్రేమతోనే నాతండ్రిని ఒప్పించాను. నీవు కృతజ్ఞత లేనివాడవు. రెండుసార్లు మరణిస్తే నిన్ను బ్రతికించుకొన్నాను. నేను లేకపోతే నీకు బ్రతుకేలేదు. నన్ను మోసంచేసినందుకు నీవు శిక్ష అనుభవించక తప్పదు. నీవు నాతండ్రి దగ్గర నేర్చుకున్న విద్య విఫలమవుతుంది. మృతసంజీవని పనిచేయదు."

అని శాపమిచ్చింది. కచుడికి దేవయానిమీద కోపమొచ్చింది.

"నేను ఎన్నడూ ధర్మమార్గాన్ని తప్పలేదు. సంజీవనీ విద్య నాకు పనిచేయక పోయినా నేను నేర్పినవారికి పనిచేస్తుంది. నాచేత ఉపదేశంపొంది దేవతలు ఉపకారం పొందుతారు. మనసుతెలుసుకోలేక నన్ను శపించావు. వివేకాన్ని మరచి ప్రవర్తించావు. నిన్ను బ్రాహ్మణుడెవ్వడూ వివాహం చేసుకోడు."

అని కచుడు దేవయానికి ప్రతిశాపం ఇచ్చాడు.

తర్వాత కచుడు దేవలోకానికి తిరిగివెళ్లాడు. విద్యను

దేవతలకెందరికో చెప్పాడు. ఆ విధంగా ఒకవిద్య పలువురకు తెలిసి ప్రయోజనకారి అయింది.

**చీరలు తారుమారైనాయి:**

ఒకనాడు దేవయాని, వృషపర్వరాకుమార్తె అయిన శర్మిష్ఠ వన విహారానికి వెళ్లారు. చెలికత్తెలతో కూడి ఆట లాడారు. చెట్ల నీడల్లో విందులు చేసుకున్నారు. జలక్రీడ లాడాలని మనసుపడ్డారు. తమవస్త్రాలన్నిటినీ కుప్పగావేసి జలక్రీడలకోసం సరసులో దిగారు. తనివితీరా ఈదులాడారు. ఆసమయంలో పెద్దగాలి వీచింది. చీరలన్నీ కలిసిపోయాయి. మొదట శర్మిష్ఠ సరస్సునుంచి బయటకు వచ్చింది. తన చీరేననుకొని దేవయాని చీర కట్టుకుంది. దేవయాని బయటి కొచ్చింది. తన చీర కనబడలేదు. ఆ స్థలంలో శర్మిష్ఠ చీర మాత్రం మిగిలివుంది.

**నీవు విడిచిన చీరకట్టను:**

దేవయానికి పట్టరాని కోపం వచ్చింది. శర్మిష్ఠతో "మా తండ్రి మీ రాక్షసులకు గురువు. పూజనీయుడు.

మిమ్మల్ని రక్షించేవాడు. బ్రతికించేవాడు. అవిధంగా
మీకంటె నేను అధికురాల్ని. పైగా బ్రాహ్మణకన్యను.
నీవు విడిచిన చీరను నేను కట్టను".

అన్నది. శర్మిష్ఠకూడా తక్కువ తినలేదు. సమవయస్కులు;

పైగా రాజు-గారి కూతురు. దేవయానితో-

"నేనేమీ నీకంటె తక్కువకాదు. మీఅయ్య మా అయ్యకు
సేవకుడు. రాజు ఇచ్చే జీతంతో కాలం గడిపేవాడు.
మీరు తినేకూడూ, కట్టే గుడ్డా మాదే. నేను విడిచిన
చీర కట్టడానికి నీకు సిగ్గెందుకు?"

అన్నది. అంతటితో ఊరుకోక దేవయానిని ఒకపాడు బడిన నూతిలో నెట్టి చెలికత్తెలతో సహా శర్మిష్ఠ ఇంటికి వెళ్ళింది. ఆ నూతిలో గుబురుగా చెట్లు, లతలు పెరిగి ఉన్నాయి. దట్టంగా ఉన్న అతీగల్లో ఒకటి దేవయాని చేతికి చిక్కింది.

ఎలాగో ప్రాణాలు దక్కాయి:

చేతులు నొప్పి పుడుతున్నాయి. చేయి మార్చి చేయి పట్టుకుంటుంది. చేతులు ఎర్రగా కంది పోయాయి. వ్రేళ్ల

వెంట రక్తం కారుతుంది. కిందచూస్తే నీళ్లు. గట్టిగా పట్టుకున్నది. ప్రాణాలు బిగబట్టి సహాయంకోసం వేచిచూస్తుంది. గాలికి ఆకు కదిలినా ప్రాణంలేచి వచ్చేది. ఎవరో వచ్చారని పైకి చూచేది. నిరుత్సాహంతో మూలిగేది. ఆసమయంలో యయాతిమహారాజు వేటాడుతూ అక్కడికి వచ్చాడు. బావిలో నుంచి మూలుగు వినబడింది. తొంగిచూశాడు. లతల్ని పట్టుకొని వ్రేలాడుతున్న స్త్రీకనిపించింది. యయాతికి ఆశ్చర్యంవేసింది. 'ఎవరునీవ'ని ప్రశ్నించాడు. యయాతిని చాలసార్లు ఆమె చూసివుంది. వెంటనే గుర్తించింది. ఇలా అన్నది-

"యయాతిమహారాజా! రాక్షసులకు గురువైన శుక్రాచార్యుల కుమార్తెను, దేవయానిని".

అని కొంచెంసేపు ఆలోచించింది. అభిమానం అడ్డువచ్చింది. ప్రమాదవశాన బావిలో పడ్డానని అబద్ధమాడింది. సహాయం కోరింది. యయాతి తన కుడిచేతి నందించాడు. చేయి పట్టుకొని తిన్నగా బావి తిన్నెఎక్కింది. దేవయాని ప్రాణంతో బయట పడింది. దేవయానిని కాపాడి యయాతి తన రాజ్యానికి వెళ్లిపోయాడు.

ఎక్కడికైనా దూరంగా వెళ్ళిపోదాం!

దేవయానిని వెతుకుతూ ఘూర్ణిక అనే దాసి వచ్చింది. తడబడుతూ నడుస్తున్న దేవయానిని చూసింది. తండ్రి శుక్రుడు ఎదురుచూస్తున్నాడని చెప్పింది. కాని దేవయాని వృషపర్వుని నగరానికి నేను రానంటే రానన్నది.

శర్మిష్ఠ నన్ను అవమానపరిచింది. ఇంక ఏ మొగం పెట్టుకొని అక్కడికి వచ్చేది? ఈవిషయం మానాన్నతో చెప్పు. నేను మాత్రం రానేరాను".

అన్నది. చెలికత్తె తిరిగిపోయింది. శుక్రునితో చెప్పింది శుక్రుని గుండె కుతకుతలాడింది. కూతుర్ని చూడాలనే తపన ఎక్కువైంది. పరుగు పరుగున ప్రయాణమై వచ్చాడు. దేవయానిని చూశాడు. ఆమె కోపాన్ని గ్రహించాడు.

"అమ్మా దేవయానీ! కోపమనేది శత్రువు. నూరు యాగాలు చేసిన వాడికంటె శాంతచిత్తుడు గొప్పవాడు ఎదుటివాడు కోపగించుకున్నా మనం కోపగించుకో రాదు. ఒకరు అపకారం చేసినా మనం ఉపకారం చేయడమే మేలు. అదే ధర్మం"

అని ఉపదేశించాడు. ఈమాటలు దేవయాని చెవి కెక్కలేదు

ఆమె మనసునిండా పగవున్నది. శుక్రుడితో ఇలా అన్నది-

"నాన్నా! ఇది మన అభిమానానికి సంబంధించింది. మన స్వేచ్ఛకు ఆటంకం కలగడం సహించలేను. రాజుల మనస్సులు రాళ్లతో సమానం. వారికి సేవ చేయడం కత్తిమీద సామువంటిది. మనం ఎంత వొదిగివున్నా వారికి కోపంరావచ్చు. రాజులకే కాదు వారిబిడ్డలకు కూడా భయపడుతుండాలి. ఈ సేవికా వృత్తి నీచమయింది. నాకాజీవితం అక్కర్లేదు. రాచ నగరికి దూరంగా ఎక్కడికయినా వెళదాం. మీ ఇష్ట మేమిటో చెప్పండి".

అన్నది. శుక్రుడు కూతుర్ని కష్టపెట్టలేదు. ఆమె కోర్కెను కాదనలేదు. సరేనన్నాడు. ఇద్దరూ ప్రయాణమయ్యారు.

**శర్మిష్ఠ నాకు దాసిగా ఉండాలి :**

ఈ వార్త వృషపర్వుడికి తెలిసింది. చింతించాడు. పరివారంతో ప్రయాణమయ్యాడు. శుక్రుణ్ణి, దేవయానిని చేరాడు. శుక్రుని కాళ్లపై బడ్డాడు. ఇలా వేడుకున్నాడు.

"మహానుభావా! ఇది మీకు ధర్మమేనా! మీ వల్లనే గదా! రాక్షసకులగౌరవం నిలుస్తుంది. మీ విద్య చేతనే గదా! మావీరులు బ్రతికి బయటపడుతున్నారు. మీరు లేనిది మేములేము. నాకుమార్తె తప్పుచేస్తే రాక్షసవంశాన్ని శిక్షించడం న్యాయమేనా? ఆ శిక్ష ఆమెకే వేయండి. సంతోషంగా స్వీకరిస్తాం. దేవయాని ఏ శిక్ష విధించినా నా కుమార్తె అనుభవిస్తుంది."

ఈ మాటలకు శుక్రుడు మెత్తబడ్డాడు. శుక్రుడిది క్షణికమైన కోపం. నవనీత సమానమైన నిండుమనస్సు ఆయనిది. దేవయానికి ప్రతీకారం తీర్చుకోవడమే కావలసింది. శర్మిష్ఠ తనకు దాసిగావుండాలని కోరింది. వృషపర్వు డంగీకరించాడు. శర్మిష్ఠనే గాక మరొక వేయిమందిని కూడా దేవయానికి దాసీలుగా పంపాడు. దేవయాని ప్రతిజ్ఞ చెల్లించుకుంది. ప్రస్తుతానికి పగ చల్లారింది.

ఆనాడే మీకు భార్యనయ్యాను!

రాకుమారి దాసి అయినందుకు దేవయాని గర్వపడింది. ఆజ్ఞలు జారీచేస్తుంది. శర్మిష్ఠ శిరసావహిస్తూవచ్చింది. చెలి

కత్తెలతోసహా వనవిహారానికి వెళ్లాలన్నది. సరే నన్నారందరు. కావలసిన సదుపాయాలు చేయమన్నది. చేశారు. వనంలోకి వెళ్లారు. ఆడి ఆడి చెట్ల నీడల్లో కూర్చున్నారు. అంతలో వేటకై వచ్చిన యయాతి మహారాజు అక్కడకే వచ్చాడు దేవయానిని గుర్తించాడు. శర్మిష్ఠను యయాతి మును పెన్నడూ చూడలేదు. అందుకే ఆమె ఎవరు? అన్నాడు. వృషపర్వుని కూతురనీ, తనదాసి అనీ దేవయాని సమాధానం చెప్పింది.

యయాతి మనసు చివుక్కుమన్నది. కాని మాట్లాడ లేదు. మౌనంగావున్న యయాతితో దేవయాని ఇలా అన్నది:

"మహారాజా! నూతినుంచి నన్ను రక్షించేటప్పుడు మీరు నాకు చేయి అందించారు. పైగా అది కుడిచేయి ఆవిధంగా పాణిగ్రహణం జరిగినట్లే. సూర్యుడే ఆనాడు మనకుసాక్షి. ఆనాడే మీకు నేను భార్యనయ్యాను. శర్మిష్ఠతో సహా ఈవేయిమంది దాసీలు మిమ్మల్ని కొలుస్తారు. నన్ను పరిగ్రహించండి."

కంచే చేనుమేస్తే ....

దానికి యయాతి

"దేవయానీ! ఇది న్యాయమా. నేను రాజును. ధర్మాన్ని రక్షించవలసినవాణ్ణి. నేనే ధర్మం తప్పితే ఎలా? కంచే చేనుమేస్తే? నేను క్షత్రియుణ్ణి. నీవు బ్రాహ్మణకన్యవు: ఇది ధర్మం కాదు".

అన్నాడు. మళ్ళా దేవయాని యయాతితో ఈవిధంగా అన్నది.

"ధర్మనిరూపణ చేయవలసినవారు గురువులు. మా తండ్రి శుక్రుడు మనవివాహం ధర్మం అని అంగీకరిస్తే ఒప్పుకుంటారా?"

ఈ జన్మకితడే భర్త:

యయాతి సరేనన్నాడు. దేవయాని తండ్రికి కబురు పెట్టింది. శుక్రుడు శిష్యగణంతోసహా వచ్చాడు. యయాతి నమస్కరించాడు. దేవయాని తండ్రికి విషయం మొత్తం పూసగ్రుచ్చినట్లు చెప్పింది:

"తండ్రీ! ఈమహారాజు ఇంతకుముందే నాకరగ్రహణం చేశారు. ఆ చేయి మరొకరు స్పృశించడం సమం

జనమా! ఈ జన్మకు నా కితడే భర్త. ఇది నా నిశ్చయం. ఇది ధర్మవిరోధమని యయాతి వాదన. మీ నిర్ణయం చెప్పండి."

అన్నది. మీవివాహం ధర్మబద్ధమైందే. లోకబాంధవుడి సాక్షిగా జరిగింది గనుక అనుమానించవలసిన పనిలేదన్నాడు శుక్రుడు. తన చేతులమీదుగా వైభవంగా దేవయాని, యయాతుల వివాహం జరిపించాడు. దాసదాసీజనాన్ని సమర్పించాడు. లాంఛనాలన్నీ నడిపించాడు, దేవయానిని రాజుకప్పగించాడు.

నాకుమార్తెకు కష్టం కలిగించకు!

"నాయనా! చిన్నప్పటినుంచి ఈమె నతిగారాబంగా పెంచాను. ఆమె మనసుకు ఏకష్టమూ కల్గనియ్యలేదు. ఆమె ఇష్టప్రకారమే అన్నీ జరగాలి. ఆమెకు ఏచిన్న అపకారం జరిగినా నా గుండె బ్రద్దలవుతుంది. నిన్ను కోరికోరి వివాహమాడింది. ఆమెకు కష్టం కలిగేటట్లు ప్రవర్తించకు. ఇదుగో ఈమె శర్మిష్ఠ. వృషపర్వుని కూతురు. దేవయానికి దాసి. ఆమెకు కావలసిన సర్వ సదుపాయాలు చేయించు. కాని చనువు ఇవ్వవద్దు.

దగ్గరకు తీయవద్దు. రాజులకు తగిందేనని వివాహమాడ వద్దు. ఆ విధంగా నా కుమార్తెకు కష్టం కలిగించకు" అన్నాడు అల్లుడితో శుక్రుడు. యయాతి దేవయానిని, శర్మిష్ఠతోసహా పరిచారికలను తీసుకొని తననగరానికి వెళ్లాడు.

**ఆనందాల అంచుల్లో....**

దేవయానిని అంతఃపురానికి తీసుకువెళ్లాడు. రాణిగా ఆమె ఆనందాన్ని అనుభవిస్తుంది. రాజుగా యయాతి ఆమెను ఆనందపెడుతున్నాడు. రాణిగా ఆమె ఆజ్ఞలు జారీ చేస్తుంది. అవి ఆచరింపబడుతున్నాయి. దేవయాని సంసార యాత్ర సజావుగా సాగి పోతుంది. ఆనందపు అంచులు చూస్తుంది. ఫలితంగా యదువు, తుర్వసుడు అనే బిడ్డల్ని కన్నది. వారితో సంతోషంగా కాలం గడుపుతున్నది.

**స్త్రీకి అంతకంటే ఏం కావాలి?**

శర్మిష్ఠమాత్రం దూరంగా అశోకవనంలో ఉంచబడింది. ఒంటరిగా కాలం గడుపుతున్న శర్మిష్ఠకు ఆలోచనలు కమ్ము కున్నాయి. ఏమిటి తనపాపం. ఎందుకు తనకీ శాపం. అష్టై

శ్వర్యాలతో తులదూగవలసిన తనకీ దురదృష్టం ఎందుకు? దేవయాని ఎంత అదృష్టం చేసిందో! అనుకూలుడైన భర్త. ముద్దులొలికే బిడ్డలు. స్త్రీకి అంతకంటె కావలసింది ఏముంది? బుడిబుడి నడకల బుడతలు ఇంట్లో తిరుగుతుంటేనే అందం, ఆనందం. వచ్చీరాని వారిమాటలు విననొంపుగా వుంటాయి. ఆభాగ్యం నాకూ కలిగితే బాగుండు - ఇవీ ఆమె ఆలోచనలు. ఆ ఆలోచనలతోనే కాలం బరువుగా వెళ్లబుచ్చుతుంది.

ఒప్పుకోకపోతే ప్రాణం వదిలేస్తాను!

అలాంటి సమయంలో ఒకరోజు రాజు యయాతి అశోక వనానికి వచ్చాడు. శర్మిష్ఠ బ్రతుకు పండింది. ఆమె మనసు నిండా సంతోషం నిండింది. రాజుతో శర్మిష్ఠ యిలా అన్నది-

"రాజా! నేను దేవయాని దాసిననీ మీకు తెలుసు. దేవయాని మీకు రాణి అయినప్పుడే నేను మీకు దాసి నయ్యాను. అంటే మీకు భార్యను. దేవయానిని గ్రహించినట్లే నన్నూ గ్రహించండి. కన్యను. రాజ పుత్రికను. మీరు తిరస్కరించడం న్యాయం కాదు. సంతానం కొరకు సంబరపడుతున్నాను. కాదనకండి".

యయాతి మనస్సు అంగీకరించింది. కాని శుక్రుని ఆజ్ఞ జ్ఞాపకం వచ్చింది. మహాత్ములకిచ్చిన మాటను దాటడం ఎలాగ? అబద్ధం ఆడినట్లు అవుతుందన్నాడు.

"మనిషికి భూతదయ అవసరం. నామీద దయ చూపించండి. మీరు అంగీకరించకపోతే నేను ప్రాణంవదలక తప్పదు. ఒకరి ప్రాణం రక్షించడంకోసం అబద్ధమాడినా తప్పులేదు. ఇది శుక్రుడు చెప్పిన నీతే. అసత్యంవల్ల వచ్చే దోషంకంటే ప్రాణసంరక్షణవల్ల వచ్చే పుణ్యం గొప్పది".

అని శర్మిష్ఠ వేడుకుంది. యయాతి మనసు కరిగింది. శర్మిష్ఠను చేపట్టాడు. యయాతివల్ల ఆమెకు ద్రుహ్యుడు అనే కొడుకు పుట్టాడు.

ఇక నాజీవితం వ్యర్థం:

ఒకరోజు దేవయాని అశోకవనానికి వచ్చింది. శర్మిష్ఠ ఇంటి ప్రాంతంలో దోగాడే బిడ్డను చూసింది.

"శర్మిష్ఠా! ఎవడీ పిల్లవాడు."

అన్నది. నాబిడ్డే నన్నది శర్మిష్ఠ. నీవు కన్యవు. శీలవతివనుకున్నాను. ఏమిటీ వింత? అని మండిపడింది శర్మిష్ఠ.

తలవాల్చింది.

"ఒక మహాత్ముడు, వేదవేదాంగాలు చదివినవాడు ఎక్కడ నుంచో వచ్చాడు. యువతినైన నన్ను చూసి జాలి పడ్డాడు. పుత్రకాంక్ష చెప్పాను. ఆయన అనుగ్రహించాడు. పుత్రుణ్ణి ప్రసాదించాడు".

అన్నది శర్మిష్ఠ. దేవయాని నిట్టూర్చి తన నివాసానికి వెళ్లిపోయింది. యయాతి శర్మిష్ఠ ఇంటికి వస్తూనే వున్నాడు. తర్వాత శర్మిష్ఠకు అనువు, పూరువు అనే కొడుకులు పుట్టారు. ఆముగ్గురూ ముద్దుగా పెరుగుతున్నారు. ఒకనాడు పిల్లలు ముగ్గురూ యయాతి మహారాజు దగ్గర్లోనే తిరుగుతున్నారు. దేవయాని చూసింది. ఆ పిల్లల్లో యయాతి రూపురేఖలు కనిపించాయి. దేవయాని అనుమానం నిజమైంది. స్పష్టంగా గ్రహించింది. ఈ పిల్లలెవరని యయాతిని నిలదీసి అడిగింది. యయాతి సమాధానం చెప్పలేదు. ఆయన కళ్లలో ఏదో భయం. దిక్కులు చూశాడు. పెదవి కదపలేదు. దేవయాని పిల్లల్ని దగ్గరికి పిలిచింది.

మీ తల్లిదండ్రులెవరని గద్దించింది. పిల్లలకేం భయం. యయాతి శర్మిషలని గర్వంగా చెప్పారు. దేవయానికి

దుఃఖంవచ్చింది. కోపం వచ్చింది. భయంవేసింది. యయాతి మోసగాడన్నది. శర్మిష్ఠను ద్రోహి అన్నది. ఆమెను శాంత పరచడానికి యయాతి ఎంతగానో ప్రయత్నించాడు. ఆమె ఇంకా రెచ్చిపోయింది.

"రాజుల్ని నమ్మరాదు. బహుభార్యాలోలురు. నిలకడ లేనివారు. మాటను నిలుపుకోలేరు".

అని ఎన్నెన్నో అన్నది. యయాతి పరిస్థితులను వివరించాడు. మాత్సర్యం పనికి రాదన్నాడు. శర్మిష్ఠపై జాలి చూపమన్నాడు. దేవయాని తోకతొక్కిన త్రాచుపాములాగా మండిపడింది. తండ్రి దగ్గరకు వెళ్ళింది.

"నాన్నా! యయాతి మాట తప్పాడు. దాసి కావలసిన శర్మిష్ఠ సవతి అయింది. ఇక నా బ్రతుకు వ్యర్థం. నా ప్రతిజ్ఞ వ్యర్థం."

అన్నది. శుక్రుడు మండిపడ్డాడు. ఆలోచించలేక పోయాడు. ఆగ్రహంతో యయాతి దగ్గరకు వచ్చాడు.

మన్నించండి! శాపం ఉపసంహరించండి!

"యయాతీ! నీవు మాటతప్పావు. నా కుమార్తె మనస్సు కష్టపెట్టావు. కనుక ముసలితనంతో బాధపడు."

అని శపించాడు. రాజు శుక్రుని యిలా ప్రార్థించాడు—

"మహానుభావా! ఇంత తెలిసినవారు మీకు కోపం తగునా? విద్యాధికులు; తెలియక ఎవరైనా తప్పుచేసినా మన్నించవలసినవారు. వయోవృద్ధులు; అనుభవం సంపాదించినవారు. అమాయకులైనవారికి చెప్ప వలసినవారు. క్షణికకోపంతో కూతురు చెప్పగానే మీరూ అదే మార్గంలో పోవచ్చునా? న్యాయాన్యా యాలు విచారించారా? ఒక యువతి ఎన్నిరోజులు దాసిగా వుండాలి? ఆమె జీవితం మొత్తం ఊడిగం చేయవలసిందేనా? ఆమెకు ఆశలుండవా? ఆనందానికి నోచుకోలేదా! పొరపాటును సరిదిద్దవలసిన పెద్దలు మీరు. ఈర్ష్య, అసూయలతో దేవయాని గ్రహించ లేదు. కాని మీరైనా ఆమెకు చెప్పవద్దా? శర్మిష్ఠ యవ్వనంలో బిడ్డలు కావాలనే తపనతో నన్ను కోరింది.

కాదంటే పాపం అంటుకుంటుందనే భయంతో అంగీక రించాను. మీరు యిలా ఆలోచించకుండా శపిస్తారని అనుకోలేదు. నాకింకా జీవితం మీద మమకారం చావ లేదు. దేవయాని మీద ప్రేమ సన్నగిల్లలేదు. సంసార యాత్ర సాగించాలనే అనుకుంటున్నాను. ఎలాగ యినా ఈ శాపాన్ని ఉపసంహరించండి."

మునలితనం ఇచ్చి యవ్వనం తీసుకో!

శుక్రుడు నిజాన్ని గ్రహించాడు. దయతలచాడు.

"రాజా! నీ మునలితనం నీ కుమారుల్లో ఎవరికైనా ఇచ్చి వారి యవ్వనం నీవు తీసుకోవచ్చు. సుఖాలను అనుభ వించవచ్చు. నీ కోసం ఆ త్యాగం చేసినవారే నీ రాజ్యానికి కూడా అర్హులు."

అన్నాడు. ఈ విధంగా శుక్రుడు యయాతి శాపానికి విమోచన మార్గం ఉపదేశించాడు.

ప్రేమతో పగను జయించు!

శుక్రుడు దేవయానిని దగ్గరకు తీసుకున్నాడు.

'అమ్మా! యయాతి మాటల్లోని నిజాన్ని ఆలోచించి చూడు. మాటపట్టుదలతో మంచీచెడ్డా మరచిపోకూడదు. పరులకు బాధ కల్గించకూడదు. తెలియనితనంలో శర్మిష్ఠ ఒక చిన్నతప్పుచేసింది; నిజమే. జీవితం మొత్తం సాధించడం పనికిరాదు. కోపం వచ్చినా దాన్ని దిగమింగుకోవడంలోనే గొప్పతనం వుంది. సాధువైనా ఆవునైనా ఎదురుతిరిగే వరకు తరమడం మంచిది గాదు. పగను మరచిపోవడం మంచిది. అది శుభం. పగవల్ల పగ నశించదు. ప్రేమవల్లనే పగ నశిస్తుంది. కోపమనేది బుద్ధిమంతుల లక్షణంకాదు. కోపం హద్దుదాటితే వివేకం నశిస్తుంది. చమురు దీపానికి ప్రాణం పోస్తుంది. అదేవిధంగా ప్రేమ జీవితానికి వెలుగునిస్తుంది. నీవు ఎదుటివారిని ప్రేమించాలి. అభిమానించాలి. అప్పుడే నిన్ను వారూ ప్రేమిస్తారు. అభిమానిస్తారు. యయాతి శర్మిష్ఠవల్ల నీకు జరిగిన అపకారం లేదు. యయాతి నిన్ను చిన్న చూపు చూడలేదు. నీ మీద ప్రేమతోనే శాపవిమోచనం కల్గించమని ప్రార్థించాడు."

అని ఎన్నోవిధాల చెప్పాడు.

**మనసే అన్నిటికీ మూలం :**

దేవయాని మనసు శాంతించింది. ఆలోచించింది. కోపం తగ్గింది. మనసులోని మబ్బులు విడిపోయాయి. యయాతి మీద మమత పెరిగింది. శర్మిష్ఠమీద మత్సరం నశించింది. హృదయంలోని భారం తగ్గింది. మనసు చల్లబడింది. అప్పుడు బాధంతా మటుమాయమైనట్లు అన్పించింది. మనసే స్వర్గాన్ని నరకంగా మారుస్తుంది. నరకాన్ని స్వర్గంగా మారుస్తుంది. మనసే సర్వం అని తనను తాను సంబాళించుకున్నది.

**మీకోర్కె తీర్చగల్గడం నా అదృష్టం :**

శుక్రుడి శాపంవల్ల యయాతికి ముసలితనం వచ్చింది, తల తెల్లబడింది. శరీరం వణకసాగింది. కళ్లు కనిపించడం లేదు. పళ్లు ఊడిపోయాయి. కాళ్లువణకుతున్నాయి. కర్ర చేతికొచ్చింది. నడవడానికి శక్తిలేదు. మాటలు తడబడుతున్నాయి. కుమారుల్ని దగ్గరకు పిలిచాడు. యదువు. తుర్వసు, ద్రుహ్యు, అనువులను ఎరసగా అడిగాడు. తన ముసలితనం తీసుకొని వారి యవ్వనం యివ్వమన్నాడు. నల్గురూ ఇలా అన్నారు-

"నాన్నా! మీ యీ కోర్కె అన్యాయం. ముసలితనం గాని, రోగంగాని దైవవశాన వస్తే ఎవరూ కాదనరు. అనుభవించక తప్పదు. కాని కావాలని ఎవరైనా కోరి కోరి వీటిని తెచ్చుకుంటారా? అడిగితేమాత్రం ఎలా అంగీకరిస్తారు? ధనం ఇవ్వవచ్చు. ధాన్యం యివ్వ వచ్చు, ఆరోగ్యాన్ని ఎలా యివ్వగలం?"

పూరువును పిలిచాడు. కోర్కె బయటపెట్టాడు.

పూరువు ఇలా అన్నాడు.

"అయ్యా! దీనికోసం ఇంతగా అడగడం ఎందుకు? నన్ను ఆజ్ఞాపించండి. తండ్రికోర్కె తీర్చని తనయుడు ఎందుకు? కన్నతండ్రికి సహాయపడేకంటే కొడుక్కి కావలసిందేముంది? తండ్రి అడక్కుండానే కోర్కెలు తీర్చే కొడుకులు ఉత్తములు. అడిగితే తీర్చేవారు మధ్యములు. అడిగినా తీర్చనివారు అధములు. మీకోర్కె తీర్చడంకంటె నాకు అదృష్టంలేదు."

అని తండ్రి ముసలితనాన్ని తీసుకొని పూరువు తన యవ్వ నాన్ని తండ్రికిచ్చాడు. యయాతి యువకుడై దేవయానిని చేరాడు. సుఖసంతోషాలతో చాలకాలం గడిపాడు.

దేవయాని విముక్తి నందింది:

యయాతి దేవయానితో కలసి ఎన్నో యాగాలుచేశాడు. యయాతికి రాజ్యభోగాలమీద మమకారం తగ్గింది. జ్ఞాని అయ్యాడు. దేవయానికిలా బోధించాడు.

"కోర్కెలు అనంతమైనవి. ఒకకోర్కె తీరగానే మరొక కోర్కె పుట్టుకొస్తుంది. చెలమలో నీటిలాగా ఊరుతూనే ఉంటాయి. తృప్తి అనేది అవసరం. అతృప్తే మానవుణ్ణి మహిమాన్వితుణ్ణి చేస్తుంది. అన్నీ మనచేతుల్లోనే ఉన్నాయని గర్వించకూడదు. అనుకొనేవన్నీ జరగవు. జరిగితే మనగొప్ప అనుకోవడం జరక్కపోతే ఎదుటి వారు అపకారం చేశారనుకోవడం భ్రమ. గర్వంతో ఎదుటివారిని నొప్పించడం పొరపాటు. ఆ పరిస్థితి ఒక్కొక్కసారి మనకే కల్గవచ్చు. అహంకారం వదలాలి. కారుణ్యం అలవరచుకోవాలి. అప్పుడే భగవంతుడు మనల్ని ఆదరిస్తాడు."

అని చెప్పి సర్వసంగపరిత్యాగం చేసి యయాతి ముక్తి పొందాడు. దేవయానికూడ హరిపదధ్యానంతో ఇలామోక్షాన్ని పొందింది–